

# అనాత్మ శ్రీ విగర్హణము

## శ్రీ శంకరాచార్యులవారు

లబ్ధా విద్యా రాజమాన్యా తతః కిం
ప్రాప్తా సంపత్ప్రాభవాఢ్యా తతః కిమ్;
భుక్తా నారీ సుందరాఙ్గీ తతః కిం
యేన స్వాత్మానైవ సాక్షాత్కృతోఽభూత్.

*తా॥ రాజమాన్యతను బొందించు విద్య లభించినను, ఫలమేమి? ప్రభుశక్తితో గూడిన సంపదను బొందినను ఫలమేమి? సుందరాంగియగు రమణితో భోగమునను భవించినను ఫలమేమి?- ఆత్మసాక్షాత్కారము లభింపనిచో ఇవి అన్నియును వ్యర్థములే.*

వ్యాఖ్య :– ఆత్మసాక్షాత్కారమును అభిలషించు సాధకుడు భౌతిక సంపదలను, విషయభోగజాలమును దరికి చేర్చక జీవిత లక్ష్యమగు ఆత్మను బడయుటకే కృషిచేయవలెనని శ్రీ శంకరులు వాక్రుచ్చుచున్నారు.

శ్రేష్ఠమగు ఆత్మవస్తువును వాంఛించు మనుజుడు అనాత్మ వస్తువుల యొక్క సౌందర్యమును చూచి మురిసిపోరాదు. మనస్సునందలి కామక్రోధాదిరూప మాలిన్యమును ప్రయత్నపూర్వకముగ పోగొట్టుకొని, భక్తిధ్యానాదులద్వారా చిత్తశుద్ధిని, జ్ఞానసిద్ధిని బడసి తద్ద్వారా ఆత్మసాక్షాత్కారము నొందుటయే ముముక్షువుల విధ్యుక్తధర్మము. అట్లొనరించి జన్మసార్థకత నొందవలెను.

ఓం

ఓం
శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీకాళహస్తి
# వేదాంతభేరి
సంస్థాపకులు:
శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

సంపుటము : 25 నవంబరు 1993 సంచిక 11



| | |
|---|---|
| సంవత్సర చందా : | రూ. 30/-లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ-520 002<br>ఫోన్స్ : 61862, 64017, 72433<br>Telex : 0475 362 ANIL Fax : 0866-63017 |
| శాశ్వత చందా : | రూ. 300/-లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి-517 640<br>ఫోన్స్: 2239,2543 STD Code 085 78 |

చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

[illegible]

**అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక**

BE FEARLESS : నిర్భయులై యుండుడు!

## విషయసూచిక



: ముఖచిత్రము :

శబరిమలపై నిలిచి
కరుణకాంతుల్ని వెదజల్లే జ్యోతిస్వరూపా!
శరణన్నవారిని సంరక్షణచేసే స్వామీ!
అయ్యప్పా! నమస్సులయ్యా!



అవ్యక్తం శాశ్వతం దేవం ప్రభవం పురుషోత్తమమ్।
ప్రపద్యేప్రాంజలిర్విష్ణు మక్షరం పరమం పదమ్॥

అవ్యక్తమై, సనాతనమైనట్టి దేవుడును, సమస్తముయొక్క ఉత్పత్తికి కారణమును, పురుషోత్తముడును, నాశరహితులును, పరమపదస్వరూపులును అగు విష్ణువునకు నేను చేతులు జోడించి నమస్కరించుచున్నాను.

ఓం

## రామనామ మహిమ

భర్జనం భవబీజానాం
ఆర్జనం సర్వసంపదాం
తర్జనం యమదూతానాం
రామరామేతి గర్జనమ్.

రామనామము సంసార దుఃఖముయొక్క బీజమును దహింపజేయును. సమస్త సంపదలను చేకూర్చును. యమదూతలను దూరముగ తరిమివేయును. స్మరించువారికి పరమానందమును గలుగజేయును.

నవంబరు 1993

# వివేకానంద శంఖారావము



Can't you being Indians, serve your own fellow country men? Go, all of you, wherever there is an out-break of plague or famine or wherever the people are in distress metigate their sufferings. At the most you may die in the attempt, what of that? How many like you are taking birth and dying like worms, everyday? What difference does that make to the world at large.

భారతీయులైయుండి మీరు మీ దేశ ప్రజలకు సేవచేయలేరా? బయలుదేరుడు. మీరందఱును వెళ్లి ఎచట ప్లేగువ్యాపించునో, ఎచట దుర్భిక్షము సంభవించునో, ఎచట జనులు బాధపడుచుందురో వారి బాధలను పోగొట్టుడు. ఈ ప్రయత్నములో ఒకవేళ మీరు మరణించినను ఫరవాలేదు. మీవంటి ప్రాణులు ఈ ప్రపంచమున ఎందఱో పురుగులవలె ప్రతిరోజు పుట్టుచు గిట్టుచు నున్నారు. దానివలన ప్రపంచమున ఏ కొఱత సంభవించును? ○○

# వేదాంతభేరి



## అసంగ శస్త్రము

### శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



కమలము నీటియందు పుట్టినను కమల పత్రము తనపై బడిన నీటిబొట్టుతో అంటుకొనదు. సాలెపురుగు అల్లిన వలయందు తక్కిన పురుగులు చిక్కుపడిపోవునే గాని సాలెపురుగు చిక్కుకొనదు. నిరంతరము ఆ వలపైననే తిరుగుచున్నను దానిలో చిక్కుపడకుండ చూచుచుండును. పెద్ద పెద్ద మిల్లులలో ఫ్యాక్టరీ డ్రైవరు ఇంజను స్టార్టుచేసి వేలకొలది చక్రములు తిరుగుటకు తానే కారకుడై, వేగముగ తిరుగుచున్న ఆ చక్రముల ప్రక్కనే సంచారము సల్పుచు, వానితో తగుల్కొనకుండ బహుచాకచక్యముతో మెలగుచుండును. ఇదియే అసంగము.

అట్లే ఈ ప్రపంచములో జ్ఞానియగువాడు ఉపాధితో, దేహేంద్రియాదులతో అనేక కార్యములాచరించుచున్నను అసంగముయొక్క దృఢాభ్యాసమువలన దేనితోను తగుల్కొనక నిజస్వరూపమగు ఆత్మయందే నిలుకడ కలిగియుండును. అజ్ఞాని ఆ దేహేంద్రియాదులతో ఐక్యమొంది, 'నేనే దేహము' అని భావించుచు, దానితో తాదాత్మ్యమును బడసి, దేహాభి

మానము వలన నానా బాధలను పొందుచుండును. శత్రువుతో యుద్ధము చేయునపుడు అస్త్రశస్త్రములు, నానా ప్రకారములగు ఆయుధములు అవసరమైన చందమున అనాదికాలమునుండి జీవునిపై దాడిచేయుచున్న మాయతో, ప్రకృతితో అజ్ఞానముతో జరుపు యుద్ధమందు అసంగమను ప్రబలమైన ఆయుధము జీవునకు ఎంతయో అవసరమైయున్నది. కనుకనే శ్రీకృష్ణభగవానుడు ఈ అసంగశస్త్రమును గూర్చి గీతయందు ప్రస్తావించి 'ఓ అర్జునా! బహుకాలమునుండి రూఢిపడియున్న ఈ సంసార రూపమహావృక్షము అసంగశస్త్రముచేతనే విచ్ఛిన్నమైపోగల'దని విశదముగ బోధనల్పిరి.

కాబట్టి ఈ సంసార రణరంగమున మాయను ఎదిర్చి నిలబడగల స్తోమత అసంగశస్త్రము కలవానికే లభించును. తక్కినవారు పలాయనము, చిత్తగించవలసివచ్చుదురు. తగిన బలములేని కారణముచే అసంగశస్త్రము, బ్రహ్మకవచము— ముముక్షువునకు అధ్యాత్మక్షేత్రమున అత్యావశ్యకములైన సాధన సామగ్రి అయియున్నవి.

దేహాది దృశ్యవర్గముతో తగుల్కొనక, తాను దేహసాక్షియైన ఆత్మయే యను దృఢనిశ్చయము నిరంతరము గలిగియుండుటయే అసంగ శస్త్ర ధారణము. అట్టి ఆత్మభావము, బ్రహ్మభావము విడువకుండ ఎల్లపుడు కలిగియుండి, సైనికుడు కవచమును ధరించి శత్రువుల ఆఘాతముల నుండి తనను సంరక్షించుకొను విధమున, సంసారరంగమున దుఃఖముల బారినుండి తనను కాపాడుకొని పరమానందమనుభవించుటయే బ్రహ్మ కవచధారణముయొక్క ఫలము.

ప్రపంచమున రెండు వస్తువులు కలవు. ఒకటి దృక్కు, రెండవది దృశ్యము. దృక్కు అనగా సర్వసాక్షియగు ఆత్మ. దృశ్యమనగా దేహేంద్రియాదులు, ప్రాపంచిక పదార్థములు. దృక్కగు ఆత్మచైతన్యము.

దృశ్యము జడము. ఈ రెండును ప్రపంచమున కలిసియున్నవి. వానిని వేఱుచేయవలెను. ఆ వేఱుచేయుటలోనే ఉన్నది మానవుని యొక్క తెలివి. అధ్యాత్మ క్షేత్రమున ముఖ్యమైన కీలకమిదియే.

అని పతంజలి నుడివినట్లు దృక్కు, దృశ్యము— ఈ రెండిటిని కలుపుట మహాప్రమాదము. కావున వానిని విడదీయవలెను. అదియే 'విభాగయోగము'. కలిసిపోయినవానిని విభజించుయోగము. దృక్కును దృశ్యముతో ఏనాడును కలపకూడదు. అజ్ఞాని కలుపుచున్నాడు కాబట్టి యే దుఃఖమతనిని వెంటాడుచున్నది. జనన మరణ పరంపర విడువకున్నది.

అని గీతాచార్యులు బోధించిన చందమున జననమరణములకు కారణము గుణసంగమే అనగా దృశ్యవర్గముతో కలియుటయే. మోక్షమునకు కారణము గుణ అసంగమే. అనగా దృశ్యముతో కలవక తాను దృక్స్వరూపమగు ఆత్మయేయని నిరంతరము భావించుచుండుటయే. ఇదియే అసంగము. ఇదియొక మహాశస్త్రము. దీనిని ముముక్షువు తప్పక సంపాదించవలసియున్నాడు. లేనిచో ఈ ప్రపంచమున శాంతి ఎన్నటికిని లభించదు. దుఃఖము వెంటాడుచునేయుండును. చావుపుట్టుకలు తరుముచునే యుండును. అయితే ఈ అసంగమను సద్గుణము ఒక్కరోజులో అకస్మాత్తుగ లభించునది కాదు. బహుకాలము గొప్ప విశ్వాసముతో సాధన చేయవలెను. ఆత్మవిచారణ యొనర్పవలెను. తీవ్రమైన వైరాగ్యమవలంబించవలెను. విషయభోగములను దూరీకరించవలెను.

ఈ ప్రకారముగ సాధన చేయువానికి భగవత్కృపచే అచిరకాలములోనే అసంగమను మహాశస్త్రము లభించగలదు. దానిచే సంసారదుఃఖమంతరించి పరమానందము జీవునకు చేకూరగలదు. OO

# శివశంకరా! నా మొర వినుమన్నా!

## శ్రీ నిమ్మల అర్జునగౌడు గారు

1. శంకర శంకర రావన్నా! శివ
శంకర నా మొర వినుమన్నా!
పరమ సుగుణ నీ పదముల నమ్మితి
పాలింపగ రావేమన్నా!

2. గిరిజామనోహర భక్త వశంకర
ఉరగభూషనిటు రావన్నా!
పరిపరి విధముల ప్రార్థనజేసితి
పరాకేల నను బ్రోవన్నా!

3. ముల్లోకంబుల చల్లగ నేలెడి
మునిజనపూజిత రుద్రన్నా!
జాలమేల నీ భక్తుని బ్రోవగ
చంద్రమౌళి వినవేమన్నా!

4. ఫాలనేత్ర నీ పరాక్రమంబును
పాపులపై జూపించన్నా!
ప్రతిదినంబు నీ పదముల మ్రొక్కెడు
బుడతలపై నెనరుంచన్నా!

5. శివ శివ శంకర శత్రు భయంకర
సిరిగిరి నిలయా శివన్నా!
శీఘ్రమేను దయబూని
భక్తుని గావగ రమ్మన్నా!

ంం

# భూకంపం

*ఒక పరిశీలన : 1993 సంవత్సరము సెప్టెంబరు 30వ తేదీ గురువారం తెల్లవారుజామున 4 గంటలకు మహారాష్ట్ర దేశమందలి కొంతభాగములో తీవ్రభూకంపము సంభవించినది. గ్రామములకు గ్రామములే తుడిచి పెట్టుకుపోయినవి. కొన్నివేలమంది చనిపోయిరి. వేలకొలది ఇండ్లు నేల మట్టమైపోయినవి.*

*—వార్త*

ఆపత్తులో మనిషి మనిషిని ఆదుకొనుట పరమధర్మము. భూకంప బాధితులకు ఉదారముగా సహాయముచేసి వారికి నిలువనీడ కల్పించి పునరావాసము ఏర్పాటుచేసి జీవించుటకు ఉపాధిని ఏర్పరచి అన్నివిధముల సహాయపడుట తోటి మానవుల యొక్క కర్తవ్యము. భూతసేవయే దైవసేవ. అదియే వాస్తవమగు దేవపూజ.

*"దుర్భర విచారవహ్నిదోధూయమానచిత్తుడగు*
*నొక్కసోదరు చెక్కిలిపై జారు*
*కన్నీరు తుడువంగ చాలుదేని*
*నాదు జన్మము సఫలముకాదె వసుధ"*

అని ఒక మహనీయుడు తెల్పిన విధమున దుఃఖించుచున్నవానికి సహాయము ఒనగూర్చుటయే జీవిత సాఫల్యమునకు సరియైన మార్గము.

ప్రపంచములో జనులకు ఈతిబాధలు కలుగుచుండుట ప్రత్యక్షముగా కానవచ్చుచున్నది. అతివృష్టి, అనావృష్టి, తుపాను, భూకంపము, అగ్నిపర్వతాల ప్రేలుళ్లు, కలరా ప్రకోపము ప్రజలను అపుడపుడు బాధించుచున్నవి. దీనికి కారణమేమి? భగవంతుడు దయాసముద్రుడు, కరుణామూర్తి, ఆపద్బాంధవుడు. సామాన్యమైన తండ్రియే తన బిడ్డలకు బాధ కలిగించవలెనని కోరుకొనడు. ఇక జగత్పితయగు భగవానుడెట్లు కోరుకొనును? ప్రజలందరు భగవంతుని బిడ్డలు. వారియొక్క క్షేమమునే భగవంతుడు వాంఛించుచుండును. వారలకు బాధ కలుగ చేయవలెనను ఉద్దేశము భగవంతునకు ఎప్పుడును వుండదు. పైగా వారి మేలునే కోరుచుండును. మరి ఈ ఆపత్తులకు కారణమేమి?

కారణము లేక కార్యమెప్పుడును సంభవించదు. జనులనుభవించు సుఖ దుఃఖములు వారి వారి పురాకృతకర్మలపై ఆధారపడివుండును. సృష్టియందు కొన్ని శాసనములు పనిచేయుచున్నవి. పాపముచేత దుఃఖముకలుగుట, పుణ్యముచేత సుఖముకలుగుట, జ్ఞానముచేత మోక్షము సంభవించుట– అనునవియే ఆ శాసనములు. ఎవ్వరైనను పాపము చేసినచో విశ్వశాసనముననుసరించి వారు ఏనాటికైనను దుఃఖ మనుభవించక తప్పదు. పుణ్యముచేసినచో సుఖమనుభవింతురు. జ్ఞానమును సంపాదించినచో మోక్షమును బడయుదురు.

జీవులనుభవించు సుఖదుఃఖములతో భగవంతునకు ఏమాత్రము సంబంధం లేదు. మరి ఇపుడెవరికైనను దుఃఖము సంభవించినచో అది వారి పురాకృతపాప ఫలితమేయగును. అట్టి దుఃఖము తొలగిపోవలెననిన పాపమును నశింపచేయు పుణ్యకార్యములను విరివిగా ఒనర్చవలెను. ఋణబాధ తొలగవలెననిన ధనమునెట్లు సంపాదించవలెనో అట్లే దుఃఖములు తొలగి పోవలెననినచో పాపములను నిర్మూలనము ఒనర్చు పుణ్యకార్యములను చేయవలెను. కాబట్టి దుఃఖము తొలగుటకును, సుఖము కలుగుటకును పుణ్యసంపాదన ఎంతయో ఆవశ్యకమై యున్నది.

'జపతో నాస్తి పాతకం' అన్నట్లు పాపము పోవుటకు భగవన్నామస్మరణ, దైవ ధ్యానము, భగవదారాధన, దానధర్మములు, పరోపకారము మొదలగునవి మిక్కుటముగా తోడ్పడును. కాబట్టి ఈతిబాధలు తొలగిపోవుటకు పుణ్యకార్యాచరణమే శరణ్యము. రామనామమునుగాని, శివనామమునుగాని, నారాయణ నామమునుగాని, హరినామమునుగాని, విఠల్ నామమునుగాని లేక మరి ఏ దైవనామమునైనను భక్తి పూర్వకముగా, శ్రద్ధాపూర్వకముగా, ఏకాగ్రతతో జపించినచో పాపరాశి భస్మమై పోగలదు. ప్రతిదినము నియమపూర్వకముగా భగవద్ధ్యానముచేయుచుండినచో చిత్తమందుగల దోషములు తొలగిపోయి మనస్సు నిర్మలము కాగలదు. నిర్మలచిత్తునకు శాంతి సుఖములు తప్పక కలిగి తీరును.

ప్రతివ్యక్తి తన దైనందిన కార్యక్రమమందు మొట్టమొదట దైవప్రార్థన, గీతా పారాయణము, భగవద్విచారణ జరిపిన తరువాత కొద్దిసేపు నిశ్చలముగా కూర్చొని తనలో కామక్రోధాది దుర్గుణములు ఏమైనా వున్నవా? అసురగుణములేవైనా ప్రవేశించినవా? అని బాగుగా విచారించవలెను. అట్టి మలినగుణములేవైన వున్నచో వాటిని వెంటనే విచారణాబలముచే వివేచనాశక్తిచే బయటికి గెంటివేయవలెను.

సత్యము, అహింస, దయ, ప్రేమ, కరుణ మొదలగు ఉదాత్తగుణములకు తనలో చోటివ్వవలెను. అట్టటి హృదయము నిష్కంటకమై శాంతి సుఖములతో విరాజిల్లును.

ఎన్ని యోగములాచరించినను ఎన్ని ఆధ్యాత్మిక సాధనలు ఒనర్చినను ఎంత తపస్సు చేసినను ప్రాణికోట్ల ఎడల దయలేనిచో అవి అంతగా శోభించవు.

ఏ ప్రాణికి బాధ కలుగచేయరాదు అని భగవద్గీతలో స్పష్టముగా పేర్కొనబడినది. అది భగవద్వాణి. కాబట్టి సుఖమును కాంక్షించు ప్రతి మానవుడు ఏ ప్రాణినీ హింసించరాదు. జంతువులను వధింపరాదు. జిహ్వాచాపల్యము కొరకై పరప్రాణిని హింసింపరాదు. ఈ ప్రకారముగా ఉత్తమగుణములను ఆర్జించుచు పరోపకారపరాయణుడై, దైవధ్యానపరుడై, ధర్మనిష్ఠుడై వుండినచో ఇక దుఃఖములుగాని, ఆపత్తులుగాని, ఈతిబాధలుగాని దరికి చేరవు.

కనుక విజ్ఞులగువారు తమ జీవితమును ధర్మమయముగా దైవభక్తిమయముగా, పరోపకారయుతముగా నొనర్చుకొనవలెను. పాపగంధము లేశమైనను హృదయమున ప్రవేశింపనీయక వుండవలెను. పరప్రాణికి ఉపకారము చేయు స్వభావము కలిగివుండవలెను. ఎవరినీ ద్వేషింపరాదు, దూషింపరాదు, బాధింపరాదు. అట్టటి ప్రపంచము సకల సౌభాగ్యములతో విలసిల్లుచు, శాంతిసుఖములను వెదజల్లుచు నుండును. ప్రజలు దుఃఖరహితులై పరమానందమనుభవించుచుందురు. క్రమముగా చిత్తశుద్ధిద్వారా ఆత్మజ్ఞానమును సంపాదించి బంధవిముక్తిని బడయుదురు.

అపుడే మానవజీవితము చరితార్థము కాగలదు. ○○

---

## దివ్య వాణి

హృది రూపం ముఖే చిహ్నం నైవేద్యముదరే తథా
తులసీ పాదతీర్థం చ మస్తకే యస్య సోఽస్మ్యహమ్.

***ఎవని హృదయమున భగవద్రూపము స్మరింపబడునో, ఎవని ముఖమున భగవచ్చిహ్నములగు తిలకాదులు విరాజిల్లునో, ఎవని ఉదరమున భగవన్నివేదితములైన ప్రసాదాదులుండునో, ఎవని శిరస్సుపై భగవదర్పిత తులసీదళ పాదతీర్థాదులుండునో, అట్టివానికి నేను ఆత్మీయుడను.***

---

# నామసంకీర్తన



(మోక్షము ఆత్మవిచారణచే కలుగును. ఆత్మవిచారణ చిత్తశుద్ధిచే కలుగును. చిత్తశుద్ధి పాపరాహిత్యముచే సిద్ధించును. పాపరాహిత్యము భగవన్నామస్మరణచేతను, దైవసంకీర్తనముచేతను, పుణ్యకార్యములచేతను సంభవించును. మహత్తర పాప విధ్వంసక శక్తిగలిగి ముముక్షువులకు అత్యావశ్యకమైయున్న అట్టి సంకీర్తనాదులు కొన్ని ఇచట పొందుపఱుపబడినవి. భక్తిశ్రద్ధలతో వీటిని గానము చేయుచుండినచో అచిరకాలము లోనే జీవుడు చిత్తశుద్ధిని బడసి దైవకృపకు పాత్రుడు కాగలడు.)

1. శ్రీకృష్ణ గోవింద హరే మురారే
   హేనాథ నారాయణ వాసుదేవ
2. రామ రామ రామ రామ రామ నామ తారకమ్
   రామకృష్ణ వాసుదేవ భక్తిముక్తిదాయకమ్
   జానకీమనోహరం సకలలోకనాయకమ్
   శంకరాదిసేవ్యమాన దివ్యనామకీర్తనమ్
3. శంభో శంకర గౌరీశా
   శాంతదయాపర విశ్వేశా
4. రామలక్ష్మణ జానకీ
   జయ బోలో హనుమానకీ
5. హరిబోల్ హరిబోల్ హరిహరి బోల్
   ముకుందమాధవ గోవిందబోల్
   శివబోల్ శివబోల్ శివశివ బోల్
   గౌరీసమేత శ్రీసాంబశివబోల్

OO

# ఆధ్యాత్మిక  కథలు

## గురుసన్నిధి

ఒకానొక ఊరిలో ఒక గృహమందు తండ్రీకొడుకులు నివసించెడి వారు. ఆ తండ్రికి ఆ 12 ఏళ్ళ కుర్రవాడు ఒక్కడే కుమారుడు. అందు వలన గారాబమున పెంచసాగెను. తండ్రి ఒకానొక వ్రతమును పాటించు చుండెను. ఆ వ్రతము ప్రకారము అతని ఇంటిలో ఎల్లప్పుడు అగ్ని వెలుగుచునే ఉండవలసియుండెను. ఆ అగ్నిహోత్రమునందు ఎప్పటి కప్పుడు సమిథలను, నేతిని వేయుచు దానిని నిరంతరము వెలిగించు చునే యుండవలెను.

ఒకసారి తండ్రి కార్యార్థమై పొరుగూరికి వెళ్ళవలసివచ్చెను. తిరిగి వచ్చుసరికి సాయంకాలమగును. ఈలోగా అగ్ని ఆరిపోకుండ జాగ్రత్త వహించవలెను. ఆ సమయమున సమీపబంధువులు ఎవరును అందు బాటులో లేకుండిరి. గత్యంతరములేక తండ్రి తన కుమారుని పిలిచి, "కుమారా! నేను పొరుగూరినుండి తిరిగివచ్చులోగా సాయంకాలమగును. కావున అంతవరకు ఈ అగ్నిని ఆరకుండ అపుడపుడు సమిథలను వేయు చుండుము. జాగరూకతతో గమనించుచుండుము" అని వచించి ప్రయా ణమై పోయెను.

తదుపరి ఆ పిల్లవాడు ఆటలలో మునిగిపోయెను. చాల సమ యము గడిచెను. ఆటపాటలలో నిమగ్నమై యున్నందున ఆ పిల్లవాడు తన తండ్రి చెప్పిన వాక్యములను మరచిపోయెను. తోటిపిల్లవాడొకడు వేణువునొకదానిని చేతనిడుకొని మురళీగానమును వినిపించుచుండెను. అది చూచి ఆశ్చర్యముతో కుమారుడు ఆ వేణువును తానుకూడ గైకొని

ఆ వేణువుతో 'మంచి పాట పాడుము, పాడుము' అని వేణువుతో చెప్ప సాగెను. వాని అజ్ఞానమునకు, అవివేకమునకు తోటిపిల్లలు హేళన చేయుచు నవ్వసాగిరి. "వేణువును నోటివద్ద పెట్టుకొని గాలిని ఊదినచో వేణునాదము, మురళీగానము వినపడును గాని, చేతిలో పెట్టుకొని పాట పాడుమనిన అది పాడునా?" అని ఈ రీతిగ అతని స్నేహితులు ఆ పిల్ల వానిని ఎగతాళి చేయుచుండిరి.

తదుపరి ఆతడు ఇంటిలోనికి ప్రవేశించెను. ఈలోగా సమిధలు లేనందువలన అగ్నికూడా ఆరిపోయియుండెను. తన తండ్రి సమిధలు వేయుచుండుటను ఆ పిల్లవాడు చిన్ననాటినుండి గమనించియుండెను గాని అగ్నిని వెలిగించుటను ఎఱుగకుండెను.

అందువలన పిల్లవాడు అయోమయస్థితిలో పడిపోయెను. అగ్నిని వెలిగించుటకు నానాతంటాలు పడసాగెను. అనేకరీతుల ఆలోచించసాగెను. కట్టెపుల్లలను కొన్నిటిని తెచ్చి అట కుప్పగ పోసెను. ఎన్ని అవస్థలు పడినప్పటికిని అగ్ని వెలుగకుండెను. చేయునదిలేక అతడు విచారముతో, విషాదవదనముతో ఒకమూల కూర్చుండెను.

సాయంకాల సమయమగుచుండగ తండ్రి తిరిగివచ్చి విషయ మంతటిని తెలుసుకొనెను. తన కుమారుని అజ్ఞానమునకు అచ్చెరు వొందెను. అగ్నిని వెలిగించుట కూడ చేతగాని తన పిల్లవాని అజ్ఞానము నకు విస్తుపోసాగెను. అనంతరమాతడు అగ్ని వెలిగించుటను తన కుమా రునకు చూపించెను.

కథలోని పిల్లవాని స్వభావము అజ్ఞానుల ప్రవర్తనను ప్రతిబింబింప జేయుచున్నది. వేణువును ఊదుటనుగాని, అగ్నిని వెలిగించుటగాని తెలియని ఆ బాలుడు నానాఅవస్థలు పడుటయేకాక తోటివారిలో నవ్వులపాలయ్యెనుకూడా! అలాగుననే జీవుడు అమూల్యమగు ఈ మానవదేహమును పొందికూడా దానిని సక్రమముగా ఉపయోగించుటను,

సద్వినియోగపరచుకొనుటను ఎఱుగకుండినచో వివేకవంతులగువారు అట్టివానిని చూచి పరిహసించుదురు.

అజ్ఞానియగు మనుజుడు గొప్ప విలువగలిగిన నరజన్మను బడసియు దానిని ఆత్మప్రాప్తియను లక్ష్యమును సాధించుటకు వినియోగించక, ఇతరత్రా, దృశ్యపదార్థముల సంపాదనకొరకు వృథాచేయుచున్నాడు. అట్టి అవివేకి జీవితలక్ష్యమగు దైవసాక్షాత్కారమును ఎన్నటికిని పొంద జాలడు. చేయవలసిన కార్యమును సక్రమపద్ధతిలో నిర్వహింపకపోవుట వలన జనులు లక్ష్యసిద్ధిని బడయజాలరు.

కావున మనుజుడు అధ్యాత్మమార్గమున పురోగమించినవారిని, ఆత్మజ్ఞానసంపన్నుడగు గురువును, మహాత్ములను ఆశ్రయించి దైవప్రాప్తికి సూటియైన మార్గమేదియో తెలుసుకొని, తద్రీతి అనుష్ఠానము సలుపుచు ధ్యేయమును సాధించి వేయవలెను. అంతియేకాని అవివేకముతో తనకు తోచినటుల వ్యవహరించుచో జనులు కార్యసిద్ధిని పొందజాలరు.

నీతి : భగవంతుని అనుగ్రహమువలన, తన పూర్వపుణ్య సుకృతమువలన జీవునకు అమూల్యమగు మానవజన్మ సంప్రాప్తించినది. అట్టి సువర్ణావకాశమును జారవిడుచుకొనక జనులు దానిని సద్వినియోగపరచు కొనుటకొరకే కృషిసలుపవలెను.

దైవప్రాప్తియను లక్ష్యసాధనకై తమకు తోచినటుల ప్రవర్తింపరాదు. లేనిచో అమూల్యమగు నరజన్మ వృథా కాగలదు. అట్లు చేయక జనులు సచ్ఛాస్త్రములు, సద్గురువులు, మహాత్ములు బోధించిన రీతి అనుసరించుచు జీవితాంతము కాకపూర్వమే అధ్యాత్మ విద్యను, బ్రహ్మవిద్యను స్వస్వరూప సాక్షాత్కారమును సాధించి మానవజన్మను సఫలీకృతము చేసుకొనవలెను. అనుభూతికి సంబంధించిన విద్య కావున దైవవిద్యను సద్గురుసన్నిధియందు నేర్చుకొని తరించవలెను. ○○

# గీతావాహిని



## చిత్తనైర్మల్యముచే ముక్తి

"అకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః" - అని శ్రీకృష్ణభగవానుడు అజ్ఞానులను గూర్చి చెప్పుచు, హృదయ పవిత్రత, చిత్తశుద్ధి లేనివారు పరమాత్మ నెన్నటికిని దర్శింపజాలరని ఘంటాపథముగ చాటివైచిరి. దేవాలయములో దేవుని ప్రతిష్ఠించక ఊరక శంఖమును ఊదినచో ఏమైన ప్రయోజనముయుండునా? అట్లే తమతమ హృదయపీఠములను పరమాత్మకు అంకితముచేయక దైవగుణముల కద్దానిని నెలవుగ నొనర్పక అసురసంపత్తికి మాత్రము అచ్చోట ఆశ్రయమును కల్పించినచో, ఎటువంటి ప్రజ్ఞావంతుడైనను లోకములో ఉపరిస్థానమునాక్రమింపజాలడు. మఱియు పెద్దలదృష్టిలో అసలు గణనకే రాడు.

కాబట్టి భగవత్సాక్షాత్కారమును అభిలషించు మానవులందఱున్ను తమ మనఃపవిత్రత విషయమై కడుజాగరూకులుగ నుండవలెను. సర్వేశ్వరుని అనుగ్రహమునకు పాత్రులు కాదలంచినవారందఱున్ను, నిర్వాణపదవిని కాంక్షించువారందఱున్ను ఈ విషయమును జ్ఞప్తియందుంచుకొని చిత్తనైర్మల్యమునకు వలసిన సాధనసామగ్రిని అవశ్యము సంపాదించుకొనవలెను.

మనస్సునుబట్టియే మఱుజన్మ ఏర్పడును. మనస్సు అతిశుద్ధముగా నున్నచో ఆత్మానుభూతి ఇచటనే గలిగి జీవుడు తరించిపోవును. స్వస్వరూపసాక్షాత్కారమును బడయగల్గి సంసార దుఃఖసముద్రమును దాటివేయును. ఒకింత శుద్ధముగానున్నచో మరణించిన తరువాత ఆ పుణ్యసంస్కారబలముచే మఱుజన్మయందు జీవిత వసంతమునుండియే తీవ్రసాధనల నొనర్చుచు క్రమముగ పూర్ణశుద్ధిబడసి దైవమందు విలీనమగును. ○○

**Cleanlines is next to godliness.**

**నిర్మలత్వమే దైవప్రాప్తికి మార్గము**

# పరమహంస ఉపదేశములు

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు బోధించిరి—

1 ఒకడు తపస్సు చేసి సిద్ధులను ప్రదర్శించును. అంతమాత్రముచే అతడు దైవాను భూతిని బడసినవాడు అని చెప్పుటకు వీలులేదు. కాని సాధనచేసి ఆత్మాను భూతిని, దైవానుభూతిని పొందిన మహనీయుడు సిద్ధులను ప్రదర్శించినప్పటి కిని, ప్రదర్శింపకపోయినప్పటికిని అతని బ్రహ్మానందానుభూతికి ఏ లోటున్ను లేదు. సిద్ధులకై ప్రాకులాడువాడు పరమశాంతిని, ఆనందమును అనుభవించలేడు. కనుక పరమసుఖమును, దైవసుఖమును కోరువాడు సిద్ధులను పొందవలెనను కోరికను వదలివేసి ఆత్మసాక్షాత్కారమునకై తీవ్రతర ప్రయత్నము గావించి సఫలీకృతుడు కావలెను.

2. గుర్రము కండ్లకు గంతలు కట్టినచో మాత్రమే అది సరియైన మార్గమున పోవును. లేనిచో అది అటు ఇటు పరుగెత్తుచు గమ్యస్థానమును చేరలేదు. అదే రీతిగ సాధకుడైనవాడు వివేకము, వైరాగ్యము అను వాటిని కలిగియుండి ఆత్మవిచారణ, ఆత్మచింతన, ఆత్మధ్యానాదులను సలుపవలెను. అప్పటికి అతడు శీఘ్రముగ, సురక్షితముగ పరమాత్మస్థానమును చేరగలడు.

3. తంత్రాదులచే నిధులను కనుగొనవచ్చును—అను వారి మాటలను జనులు విశ్వసింపరాదు. దృశ్యాసక్తి, బాహ్యప్రవృత్తిగల మనస్సు దైవధ్యానమందు స్థిరత్వ మును పొందలేదు. మనస్సు చంచలముగ ఉన్నచో అతనికి శాంతి లభించనేరదు. కనుక దైవప్రాప్తిని వాంఛించువాడు దృశ్యవస్తువులు అశాశ్వతములని, ప్రాపంచిక సుఖములు దుఃఖమిశ్రితములని వివేకముచే బాగుగ విచారించి తీవ్రవైరాగ్యమును కలిగియుండవలెను. అప్పుడతని మనస్సు అంతర్ముఖమై భగవంతునియందు నిలకడను సంపాదించును. మనస్సు నిశ్చలము, నిర్మలము అయినచో మనుజ నకు పూర్ణశాంతి లభించును.

(తరువాయి 21వ పేజీలో)

# భేదదృష్టిని విడనాడండి!

(26.1.93 తేదీన తిరుపతి-అన్నమాచార్య కళామందిరంలో జరిగిన విశ్వధర్మ సమ్మేళనంలో శుకబ్రహ్మాశ్రమ పీఠాధిపతులైన పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు చేసిన ప్రసంగానికి సంగ్రహరూపం)

సంగ్రాహకుడు: శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు (తిరుపతి) సాహిత్య శిరోమణి

ఇది విశ్వధర్మ సమ్మేళనం. అందువల్ల సర్వదేవతాప్రతిపాదకమైన ప్రార్థనా శ్లోకంతో ఉపన్యాసం ప్రారంభించబడుతున్నది-

యం శైవాస్సముపాసతే శివ ఇతి
బ్రహ్మేతి వేదాంతినః
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః
కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః
కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛితఫలం
త్రైలోక్యనాథో విభుః

"ఏ దేవుని శైవులు శివుడనీ, వేదాంతులు బ్రహ్మమనీ, బౌద్ధులు బుద్ధుడనీ, ప్రమాణ నిరూపణంలో సమర్థులైన తార్కికులు కర్త అనీ, జైనులు అర్హత్ అనీ, మీమాంసకులు కర్మ అనీ ఉపాసిస్తున్నారో, ఆ త్రిలోకనాథుడైన దేవుడు మీ అభీష్టాలను నెరవేర్చుగాక" అని పై శ్లోకానికి తాత్పర్యం.

భేదం అజ్ఞానంవల్ల కలుగుతుంది. ప్రపంచంలో నిత్యానిత్యాలు, సత్యాసత్యాలు కలిసి వున్నాయి. వివేకంతో వాటిని విభజించాలి. ఈ సభ వివేకానందస్వామికి స్మారకంగా జరుగుతున్నది. ఆయనకు 'వివేకానంద' అని చాలా మంచి పేరు పెట్టారు. వివేకంతోనే విభాగం సిద్ధిస్తుంది.

వడ్లు, బియ్యం కలిసిపోతే వాటిని విడదీయాలి. భగవంతుడు గీతలో గుణత్రయ విభాగం, శ్రద్ధాత్రయవిభాగం-అని విభజించే విధానం బోధించాడు. జాతిమత కులాలన్నీ భేదదృష్టికి కనిపించేవే. వీటివల్ల విరోధాలు, కలహాలు, అశాంతీ

ఏర్పడుతాయి. అందువల్ల భేదదృష్టిని విడనాడండి!

ఏ వ్యక్తికీ తనపై తనకు విరోధం లేదు. అలాగే లోకమంతా ఆత్మస్వరూప మని గ్రహించితే ఎవరితోనూ విరోధం వుండదు. "నాకు బలం వున్నది, నేను వాణ్ణి ఎందుకు కొట్టగూడదు" అనే స్వభావం భేదదృష్టివల్ల కలుగుతున్నది.

అపరాధాలకు శిక్షలు విధిస్తున్నారు. కాని శిక్షలవల్ల నిజమైన మార్పు కలగడం లేదు. హృదయంలో ప్రేమ, దయ, అహింస మొదలైన సద్గుణాలు పెంపొందించు కోవాలి. అప్పుడు మార్పు వస్తుంది.

దేవుడు చాలా గొప్పవాడు, కాని మన సంగతి ఏమిటి? మనకు గొప్పతనం ఎలా సిద్ధిస్తుంది? దేవునిలో పవిత్రత వున్నది కాబట్టి వారు గొప్పవారు మనకు కూడా పవిత్రత కావాలి.

ప్రతివాని హృదయంలోనూ దైవత్వం తాండవిస్తున్నది. అజ్ఞానంవల్ల అది వ్యక్తంకావడంలేదు. దానిని వ్యక్తంచేసుకోవాలి. జీవబ్రహ్మైక్యం సాధించాలి. పాలు నీరులాగా జీవబ్రహ్మలు రెండూ కలిసిపోవాలి.

మానవత్వం భగవంతుని కృపచేత సిద్ధించింది. దీన్ని సద్వినియోగం చేసుకొని మళ్లీ జన్మలేని స్థితిని సంపాదించాలి. 'మాతుః పయోధరరసం నపునః పిబంతి' అన్నదే ఈ జీవితలక్ష్యం కావాలి.

ఈ జగన్నాటకరంగంలో మనం ఎన్నో వేషాలు వేస్తున్నాము. భగవంతుడు చూస్తున్నాడు. వేషాలు వేసినవాడు చివరికి బహుమానం పొందాలికదా! ఏమిటా బహుమానం? మళ్ళీ వేషాలు వేయకుండా వుండే స్థితే ఆ బహుమానం. ఈ బహుమానం ఇమ్మని భగవంతుని ప్రార్థించాలి. జననమరణాలు లేని స్థితిని అందుకోవాలి.

వివేకానందులు 'Each soul is potentially divine' అని చెప్పారు. ప్రతివాని లోనూ దివ్యత్వం గర్భితమై వున్నది. దాన్ని వ్యక్తీకరించడమే జీవితలక్ష్యం. బాల్యం నుండీ మాకు వివేకానందుని సాహిత్యంపై అభిరుచి మెండుగా వుండేది. వారి మాటలు చాలా పటుత్వం కలిగి వుంటాయి. వారి 'యతిగీతం' (Song of the Sannyasin)లో చాలా చక్కని ప్రబోధం గావించారు.

లోకంలో కనిపించే భేదాలకు కారణం ఏమి? పూర్వకృత కర్మమే. "అవని జల్లిన వెద్దియో అదియె పండు" — అన్నట్లు మనం ఏ విత్తనాలు చల్లుతామో, ఆ ఫలమే చేతికి వస్తుంది. అందువల్ల జీవితాన్ని ఎల్లప్పుడూ పవిత్రంగా వుంచుకోవాలి.

యస్మీన్ సర్వాణీ భూతాని

*నవంబరు 1993*

*ఆత్మైవా భూ ద్విజానతః*
*తత్ర కో మోహః కః శోకః*
*ఏకత్వ మనుపశ్యతః*

సమస్త ప్రాణులూ తన ఆత్మే అని గ్రహించి, ఏకత్వ దృష్టిల జ్ఞానికి శోక మోహాలు ఎలా కల్గుతాయి? ముందు ఇంద్రియాలను జయించాలి. బాహ్యజగత్తును జయించితే ప్రయోజనం లేదు. ప్రహ్లాదుడు తన తండ్రికి ఈ విషయమే బోధించాడు.

*ఆత్మౌపమ్యేన సర్వత్ర*
*సమం పశ్యతి యోஉర్జున!*
*సుఖంవా యదివా దుఃఖం*
*స యోగీ పరమోమతః!*

అని శ్రీకృష్ణుని బోధ. తనకు కలిగినట్లే సుఖదుఃఖాలు అన్ని ప్రాణులకూ కలుగుతాయి అని భావించి సమదృష్టితో ప్రవర్తించేవాడే పరమయోగి.

వివేకశబ్దాన్ని బాగా మననం చేసుకోవాలి. క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపాన్ని గ్రహించాలి. సమస్త ప్రాణులనూ ప్రేమించాలి. ప్రేమ లేకపోవడంవల్లనే దోపిడీలు, దహనాలు మొదలైన అకృత్యాలు జరుగుతున్నవి.

ఒక పెద్దమనిషిని దేవాలయ నిర్మాణానికి "తమకు తోచిన చందా ఇమ్మ"ని ఒకడు అర్థించాడట! ఆయన "నాకేమీ తోచలేదు. పో"మ్మన్నాడట! త్యాగం లేక పోతే అమృతత్వం సిద్ధించదు. "తేన త్యక్తేన భుంజీథాః" అని శ్రుతి ఘోషించింది. రంతిదేవుడు ఎంత త్యాగమూర్తియో గమనించండి!

శ్రీ వివేకానందస్వామి ఎన్నో ప్రబోధాలు చేశారు. 'నిర్భయంగా వుండండి' అన్న ప్రబోధం చాలా ముఖ్యమైనది. అభయం, ధైర్యం అనేవి చాలా మేలైన గుణాలు. ఇదంతా మిథ్య. ఒకనాటికి కాలగర్భంలో కలిసిపోతుంది. రాజులు పోయారు. రాజ్యాలు పోయాయి.

అయితే శరీరం, బంధువులు–అంతా పోయినా, పోనిది ఒకటి వున్నది. అదే ఆత్మ.

*'నజాయతే మ్రియతే వా కదాచిత్'*

అన్నట్లు ఆత్మకు జననమరణాలు లేవు. మనం భగవత్స్వరూపాన్ని, లేదా ఆత్మస్వరూపాన్ని ఈ జన్మలోనే గ్రహించవచ్చు. ఏడవడం తగదు.

"ఆత్మాతు సతతం ప్రాప్తో౽
ప్యప్రాప్తవదవిద్యయా!"

అన్నట్లు ఆత్మ సదా లభించేవున్నా, అవిద్యవల్ల దాన్ని పోగొట్టుకొన్నట్లు భావిస్తున్నారు. ఇదే స్వకంఠాభరణన్యాయం అంటే.

ఒక స్త్రీ తన మెడలోనే ఆభరణం పెట్టుకొని దాని సంగతి మరచి ఇల్లంతా అందుకై వెదకిందట! అలా చేయక సతతప్రాప్తమైవున్న ఆత్మను గ్రహించాలి. అవిద్యను దూరంచేసుకోవాలి.

త్రాడును చూచి పాము అనుకుంటే భయం తప్పదు. ఇదే రజ్జుసర్ప భ్రాంతి. త్రాడు యొక్క నిజరూపాన్ని గ్రహించితే భయంలేదు. ఆత్మస్వరూపం గ్రహించిన వానికి కూడా సంసారభయం వుండదు.

"నేను రాతిలో నిద్రించాను, లోహంలో కలగన్నాను, చెట్టు చేమల్లో సగం మేల్కొన్నాను, జంతువులో పూర్తిగా మేల్కొన్నాను, మానవునిలో నిజస్వరూపాన్ని గ్రహించాను" అన్న సూక్తిలోని సారాంశం గ్రహించండి.

ఈ ఉపన్యాస సారాంశాన్ని గుర్తుంచుకొని మననం చేసుకోండి. డార్విన్ కోతి నుండి మానవత్వం వచ్చిందన్నాడు. మానవత్వం నుండి మాధవత్వం సాధించి ధన్యులుకండి!!! ○○

---

(17వ పేజీ తరువాయి)

4. 84 లక్షల జీవరాసులలో మానవజన్మ శ్రేష్ఠమైనది. పూర్వజన్మ సుకృతము వలననే జీవునకు మనుష్యజన్మ, ముముక్షుత్వము, మహాత్ముల సాంగత్యము లభించుచున్నవి. కావున మానవుడు నరజన్మ యొక్క గొప్పతనమును గుర్తెరిగి, శమదమాది సాధనలను, ధ్యానాదులను ఆచరించుచు పరబ్రహ్మ సాక్షాత్కారమును బడసి సాక్షాత్ దైవస్వరూపుడుగ విరాజిల్లవలెను.

5. ఆధ్యాత్మిక సాధకుడు పవిత్రత, సహనము, పట్టుదల కలిగి ధ్యానాదులను సలుపవలెను. ముముక్షువు బాహ్యశుచిని, అభ్యంతర శుచిని కలిగి, దైవసాక్షాత్కారమును పొందువరకు పట్టుదలతో కృషి సలుపవలెను. నిందాస్తుతులందు, శీతోష్ణాది ద్వంద్వములందు సమభావమును, శాంతభావమును అవలంబించి నిరంతరము దైవచింతన, దైవధ్యానమును సలుపువాడు శీఘ్రముగ ఆత్మజ్ఞానమును సంపాదించి కృతకృత్యుడగును. ○○

జర్మనీ నియంత అడాల్ఫ్ హిట్లరుకు రెండు ప్రత్యేకమైన కార్లు కలవట. వాటి ఒక్కొక్కదాని పొడవు 20 అడుగులు, బరువు 10 వేల పౌన్లు. వాటికి అరంగుళము మందముగల బుల్లెట్ ప్రూఫ్ అద్దము మరియు $1\frac{1}{4}$ అంగుళము మందముగల లోహపు కవచము అమర్చబడియుండెను.

1936వ సంవత్సరంలో భారతదేశమందు మిశ్రీలాల్‌జీ మహరాజ్ అను వ్యక్తి ఆహారము లేకుండా 265 రోజులు ఉండగలిగెను.

1990వ సంవత్సరంనాటికి భారతదేశమందు 355 చక్కెర ఫ్యాక్టరీలు కలవు.

4. ఒక పౌను తేనెకొరకై తేనెటీగలు 20 లక్షల పువ్వుల నుండి మకరందమును సేకరించవలసి యుండును.

5. రెడ్ షైర్ చేపలు గాలిలో ఎగురగలవు మరియు కాకులవలె అరువగలవు.

6. 1992వ సంవత్సరంనాటికి ప్రపంచములోకెల్లా పెద్దదైన జల జంతు ప్రదర్శనశాల అమెరికాలోని చికాగోనందు కలదు. దాని పేరు జాన్ G. షెడ్ జలజంతు ప్రదర్శనశాల. అందు 350 రకముల జలజీవరాసులు గలవు. ప్రతిదినము 80 వేలమంది దానిని సందర్శించుచుందురు.

7. ప్రపంచములో ఫలములను ఉత్పత్తిచేయుటలో భారతదేశము మూడవ స్థానమును కలిగియున్నది. OO

# ఈశ్వర్

దేవుని యొక్క స్వరూపమెట్టిదని ప్రశ్నించువారు అనేకమందుంటారు. ఈ కనుపించు సూర్యచంద్రాదులు, నక్షత్రములు, గ్రహములు వెయ్యేల చరాచర ప్రపంచమును పరిపాలించు మహత్తరమైన శక్తి ఒకటి వుండి తీరాలి! ఆ శక్తియే దేవుడంటారు ఆస్తికులు. అట్టి శక్తిని ప్రకృతి (Nature) అంటారు నాస్తికులు. పేరేదైనా కానివ్వండి సృష్టి కనుపిస్తుంది. కావున సృష్టికర్త ఒకరుండాలనే నిర్ణయానికొచ్చారు చాలామంది.

ఆ సృష్టికర్త ఎందుకు కనుపించలేదంటారు మరికొంతమంది–వారు కనుపించ నవసరము లేదంటారు మహాత్ములు. కరెంటుకు సంబంధించిన ట్రాన్సుఫార్మర్ ఎక్కడో వుంటుంది. అది మనకు కనుపించదు. కనుపించనవసరము లేదు. అది అక్కడ నుండి విద్యుత్ పంపుతుంది. తద్వారా మన ఇంటిలో లైట్స్ వెలిగి చీకటి పోతుంది. అలాగే సృష్టికర్తయగు భగవంతుడు మన బాహ్యనేత్రములకు కనుపించ నవసరములేదు. వారు వున్నచోటునుండి ఈ సృష్టిక్రమమును చక్కగా, సవ్యంగా నడిపించగల సమర్థులు. వారి సంకల్పముచే వారి పరివారమగు సూర్య, చంద్ర, నక్షత్రాది గ్రహాలు వారు నిర్దేశించిన కార్యక్రమములను తు.చ.తప్పకుండా పాటించి అమలుపరచుచుందురు.

వేరొక దృష్టితో ఆలోచిస్తే భగవంతుడు మన వెంట మన ఇంట, మన చెంతనే వుండి మనము చేయు ప్రతి పనిని సాక్షిగ చూస్తున్నారు. కావున మంచిపనులే చేయాలి, మంచిగనే మాట్లాడాలి, మంచిగనే వుండాలి, మంచినే పెంచుకోవాలి. ఎవరిపైన ద్వేషము, అసూయ, అపకారాదులు తలపెట్టరాదు. ఎవరిని హింసించ రాదు, బాధించరాదు. చేతనైనంత ఉపకారం చేయాలి. ఉపకారము చేయలేకపోతే ఊరికె వుండుట కూడా ఒక విధముగ ఉపకారము చేసినట్లే (అపకారము చేయ కుండుట ఒక విధముగా ఉపకారము చేసినట్లే.)

# సుభాషితములు

రత్నైర్మహార్ఘైః తుతుషుర్న దేవాః
న భేజిరే భీమవిషేణ భీతిః
సుధాం వినా న ప్రయయుః విరామం
న నిశ్చితార్థాత్ విరమన్తి ధీరాః

***క్షీరసముద్రము నుండి వెలువడిన రత్నములను చూచి దేవతలు సంతోషించలేదు. విషమును చూచి భయపడలేదు. అమృతము లభించువఱకు విరామమును గైకొనలేదు. తాము అభిలషించిన పదార్థము లభించువఱకు మహనీయులు విశ్రమించరు.***

నరస్యాభరణం రూపం
రూపస్యాభరణం గుణః
గుణస్యాభరణం జ్ఞానం
జ్ఞానస్యాభరణం క్షమా

***మనుజునకు ఆభరణము రూపము. రూపమునకు ఆభరణము గుణము. గుణమునకు ఆభరణము జ్ఞానము. జ్ఞానమునకు ఆభరణము ఓర్పు.*** OO

---

☞ భగవంతుడు మన బాహ్య నేత్రములకు కనుపించి మన ఎదురుగ వుంటే మనము ఎంత జాగ్రత్తగా, భక్తిగా వుందుమో, పాపపు పనులను మనస్సునందుకూడా సంకల్పించమో, బాహ్యనేత్రములకు కనుపించక నిరాకారంగా అణువణువునా వ్యాపించియున్న భగవంతుడు మనము చేయు ప్రతి పనిని సాక్షిగ వీక్షిస్తున్నారని యెరింగి అత్యంత జాగరూకతతో వ్యవహరించవలెను. అప్పుడే మరుజన్మ శుద్ధముగ, శుభ్రముగ వుండగలదు. లేక జన్మరాహిత్యము కలుగగలదు. అలా కానిచో అశాంతి అనే గోతిలో పడి అలమటించవలసిందే. తద్వారా అమూల్యమైన మానవజన్మను మంటకలపవలసివచ్చును.

కావున భగవంతుని ప్రార్థిస్తూ, పూజిస్తూ, ఆరాధిస్తూ, ధ్యానిస్తూ, దయ, కరుణ, ప్రేమ, అహింస మొదలగు సుగుణములుగలిగినవారే భగవదనుగ్రహమునకు పాత్రులై శాంతిసుఖాలతో విరాజిల్లుదురు. మనము కూడ అట్టి ప్రయత్నములో ముందుకు పోదాం! OO

# ప్రశ్నోత్తర వేదిక ?



## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

(తిరుపతి)

**ప్రశ్న : *మనలో ఒక్కొక్కడి ప్రవృత్తి ఒక్కొక్క రకంగా ఉంటుంది. ఒక తల్లికి పుట్టిన బిడ్డలు అందఱూ, ఒకే రకమైన శ్రద్ధ కలవారుగా ఉండరు. ఏమిటి కారణం? స్వభావాలిలా ఎందుకు వేఱు వేఱుగా ఉంటాయి?***

**జవాబు :** మనమంతా మానవులమే. కాని మనలో వాసనలు, అంటే సంస్కారాలు భిన్నభిన్నంగా ఉంటాయి. ఆ వాసనలవల్ల ఒక్కొక్కరి స్వభావం ఒక్కొక్క రకంగా ఉంటుంది. విభిన్న స్వభావాలుకల మన అందఱిలో పుట్టుకనుంచి సాత్త్విక-రాజస-తామసాలని మూడు రకాల శ్రద్ధలుంటాయి. మనలో ఎవరికి ఎలాంటి శ్రద్ధ కలిగినా అది వారి స్వభావాన్నిబట్టే కలుగుతుంది. అసలు మానవుడు శ్రద్ధాస్వరూపుడు. వాడి శ్రద్ధనుబట్టే వాడి ఆలోచనలు, ప్రవృత్తులు ఉంటాయి. కనుక చూడటానికి అందఱు ఒకేలా కనబడ్డా, వారి లోపలి ప్రపంచాలు వేఱు వేఱుగా ఉంటాయి. వారి సంస్కారాలనుబట్టి స్వభావాలు, స్వభావాలనుబట్టి శ్రద్ధలు, శ్రద్ధలనుబట్టి ప్రవృత్తులు, ప్రవృత్తులమబట్టి వారు సాధించే ఫలితాలు ఉంటాయి.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః (భగవద్గీత 17-3)

**ప్రశ్న : *కొందఱు సమాజంలో దైవాంశసంభూతులైన రామకృష్ణాదులను ఆరాధిస్తారు. ఇంకొందఱు యక్షిణీ, రాక్షసులను ఉపాసిస్తారు. మఱికొందఱు భూత-***

# శ్రీ రమణమహర్షులవారు

సాధన అవసరమే. అయితే దేనికి సాధన? తాను ఎప్పుడూ ఎక్కడా వున్నాడు. తనకై ప్రయత్నించి ఎక్కడనుంచో తెచ్చుకోపనిలేదు. తాను తానుగా నిలుచుటకు అడ్డువచ్చే శరీరాది భ్రాంతులను పోగొట్టే నిమిత్తమే సాధన. సత్యమైన తనను చూడక, తనచే చూడబడు అసత్యమైన శరీరాది ప్రపంచమే సత్యమని తలచటంవల్ల భ్రాంతి కలుగుతుంది.

ఆ భ్రాంతిపోగొట్టే నిమిత్తమే సాధన. భ్రాంతిని పోగొట్టితే ఉండేది నీవే. నీలోనే సమస్తము వుంది.

'శరీరం నేనసే భ్రాంతిని పోగొట్టు కోటానికే సమస్తసాధనలున్నా, 'నేనున్నా' నను తెలివి (ప్రజ్ఞ) ఏది వుందో దానిని ఆత్మ అనండి, పరమాత్మ అనండి, మఱేమన్నా అనండి, అది ఎప్పుడూ ఎక్కడా వుండనే వుంది.

'శరీరాదులు నేను కాదు' అని నిశ్చయించి దేహాహంభావనను తొలగిస్తే మిగిలేదే ఆ ప్రజ్ఞారూప పరమాత్మ. ○○

**ప్రేతాలను కొలుస్తారు. దీన్నిబట్టి వీరి శ్రద్ధలను నిర్ణయించవచ్చా?**

**జవాబు :** తప్పకుండా నిర్ణయించవచ్చు. సాత్త్విక శ్రద్ధకలవాళ్ళు రామకృష్ణాది సాత్త్విక దేవతలను ఆరాధిస్తారు. రాజసశ్రద్ధకలవాళ్ళు యక్షులను, యక్షిణిలను, రాక్షసులను వశపరచుకోవడానికి తగిన ఉపాసనలు చేస్తుంటారు. తామస శ్రద్ధ కలవాళ్ళు భూత-ప్రేతాలను కొలుస్తుంటారు. కనుక వారి అభిరుచులనుబట్టి, వారి శ్రద్ధలను మనం అర్థంచేసుకోవచ్చు.

యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః

(భగవద్గీత 17-4) ○○

వేదాంతభేరి



# యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి–

భృగుమహర్షి జ్ఞానదృష్టిచే ముహూర్తమాత్రకాలమంతయు పరికించి తదుపరి కాలునితో "నీవు చెప్పినదంతయు సత్యము. నేను పొరబడి మఱియొక విధముగా తలంచితిని" అని చెప్పగా నంత కాలుడిట్లనెను–

[illegible] పాపముక్షయింప అంతఃకరణము శుద్ధముకాగా సజ్జనుల నిర్మలబుద్ధి శాస్త్రవిచారణయందు ప్రవృత్తి గలదగును, శాస్త్రవిచారణచే మనోమోహము నశించును"–కాలుడిట్లు పలికినమీదట నంత వారిరువురును గలిసి స్వర్గమునుండి బయలుదేఱి భూతలమున సమంగా నదీతటమున తపంబు సల్పుచున్న శుక్రునికడకుఁబోయిరి. అచటికిఁబోయి కాలుఁడు భృగువునకు బ్రాహ్మణరూపమున తపమొనరించుచున్న శుక్రుని జూపి 'ఈతడు సమాధినుండి లేచుగాక' యని సంకల్పింప శుక్రుఁడు సమాధినుండి లేచి వారలకు నమస్కరించి 'మీరెవరని ప్రశ్నింప, భృగువు 'నీవు నిన్ను స్మరించుకొనుము' అని చెప్ప అంత శుక్రుడు రెండు ఘడియలు ధ్యానమునందుండి తన పూర్వ విషయ మంతయు స్మరించి విస్మితుఁడై తన కృతకృత్యత్వమును, ఆత్మజ్ఞానప్రాప్తిని భృగువున కెఱింగించి ఆ తన "మందరాచలస్థితపూర్వ దేహమును చూచుటకు బోయెదము, రండు" అనెను. అట్లే వారు ముప్పురును మందర పర్వతమునకు జనిరి. అచట శుక్రుఁడు–నీరసించి శుష్కించియున్నట్టి పూర్వదేహమును వీక్షించి, 'ఆహా! ఇద్దానితో పూర్వమనేక భోగములననుభవించితిని. దీనిని విశేషముగ ప్రేమించితిని. అట్టి యిది యిపుడు శుష్కించి, శిథిలమై పోయినది!' అని పలికెను.

ఓ రామచంద్రా! వ్యవహారదశయందు జ్ఞానులును అజ్ఞానులును ఒకే విధముగ నుందురు. కాని అజ్ఞానులు సక్తులై బద్ధులగుదురు. జ్ఞానులు అసక్తులై నిర్లేపులై, ఆత్మస్థితిగలవారై ముక్తులగుదురు. కర్మేంద్రియములతో సక్తులైనను జ్ఞానేంద్రియములతో అసక్తులై యుండువారు ముక్తులే.

పిమ్మట కాలుఁడు శుక్రునితో "నీవు ఈ పూర్వ దేహమునఁ బ్రవేశింపుము. ఈ దేహములతో నీవు తపంబు సల్పి ఆ పిదప గ్రహాధికారమును, అసుర గురుత్వ మును బొందెదవు. అటుపిమ్మట తన పూర్వదేహమునఁ బ్రవేశింప భృగువు ఆ దేహముపై జలమును మంత్రయుక్తముగ సంప్రోక్షించెను. అపుడు పూర్వమువలెనే శుక్రుని దేహము పవిత్రమాయెను. ఆతడు తండ్రికి నమస్కరించెను. తండ్రి యాతనిని ప్రేమతో కౌగిలించుకొనెను. అపుడు వారు ఆ శుక్రుని బ్రాహ్మణ శరీర మును కులాచార ప్రకారము దహనముచేసివైచి ఆ మందరవనముననే తపంబు సల్పుచునుండ కాలక్రమమున శుక్రునకు గ్రహాధికారము, దైత్యగురుత్వము లభించెను. భృగువున్ను తన ప్రజాపతి అధికారముననుండెను.

'ఓ రామచంద్రా! నీవు సర్వప్రయత్నములచే ఇంద్రియములను జయించి చిత్తమును వశమొనర్చుకొనుము. అపుడే మోక్షము లభించి జీవన్ముక్తుడవగుదువు. జీవన్ముక్తుండీ శరీరమను నగరమున రాజువలె సుఖముగ తన శేషించిన ప్రారబ్ధము ననుభవించుచుండును. ఏ దుఃఖమున్ను అతనిని బాధింపజాలదు. జీవితమంతయు అతనికి సుఖమయముగ నుండును. ఇంద్రియములకు వశులగు జనులను జూచియు, అజ్ఞప్రపంచమును గాంచియు ఆతఁడు నవ్వుచుండును. ఓ రామచంద్రా! నీవు దామవ్యాళకటన్యాయము ననుస రింపకుము. భీమ భాస దృఢన్యాయమనుసరించి దుఃఖరహితుడవు కమ్ము.

(ఈ న్యాయములను గూర్చిన వివరము రాబోవు సంచికలో ప్రకటింప బడగలదు)

OO

## గృహవైద్యము

**ఎండబెట్టిన నేరేడు గింజల చూర్ణమును సేవించినచో అతి మూత్రవ్యాధి తొలగును.**




# ఉడిపి

## ఓంప్రకాశ్

తూర్పున పడమటి కనుమలు–పడమట అరేబియా సముద్రం. ఈ రెండింటి మధ్య వున్న భూమి, ఉత్తరంలో గోకర్ణం మొదలు దక్షిణంలో కన్యాకుమారి వరకు విస్తరించి వుంది. అదే పరశురామక్షేత్రం. ఈ క్షేత్రంలోనే దక్షిణ కర్ణాటకలో 'ఉడిపి' ఉంది. పూర్వం దీనిని 'ఉడుపా' అనేవారు. 'ఉడ్' అంటే నక్షత్రం. 'పా' అంటే పాలించువాడు. 'ఉడుపా' అంటే నక్షత్రపాలకుడు–చంద్రుడన్నమాట. చంద్రుడిక్కడ తపస్సు చేశాడట! పూర్వంలో 'ఉడిపిని' శివాలీ, రజతపీఠపురమని కూడా పిలిచేవారు.

### మార్గం

'మంగళూర్' స్టేషను నుండి 'ఉడిపి' దగ్గర. బస్సులుంటాయి. శృంగేరి నుండి కూడా 'ఉడిపి'కి వెళ్ళవచ్చు. ఉడిపిలో ఎనిమిది మఠాలున్నాయి. వాటిలో యాత్రికులు ఆశ్రయం పొందవచ్చు.

### దర్శనీయ స్థలాలు

'ఉడిపి'కి ఆరు మైళ్ళ దూరంలో "వెల్లే" గ్రామంలో ద్వైతమతస్థాపకాచార్యుడైన శ్రీమధ్వాచార్యుడు జన్మించాడు. అక్కడే శాస్త్రాలు చదువుకొన్నాడు. శ్రీ అనంతేశ్వర దేవాలయ అచ్యుత ప్రకాశాచార్యులను తన గురువుగా స్వీకరించాడు. గురువు తర్వాత, మధ్వుడే దేవాలయ పీఠాన్ని అధిరోహించాడు. ఆ దేవాలయం చూడదగ్గది.

అనంతేశ్వర దేవాలయానికి ఉత్తర–తూర్పు దిశలో శ్రీకృష్ణమఠం వుంది. ద్వారంలోకి వెళ్లగానే మధ్య సరోవరం కనబడుతుంది. ఆలయ కప్పులో వెండి ఆకులు–బంగారు తీగెలు, పూలు ఉన్న శిల్పం కనబడుతుంది. గోడలమీద విష్ణు భగవానుని అవతారాలను చిత్రీకరించారు. ఆలయంలో ముందుగా శ్రీమధ్వుని

విగ్రహం కనబడుతుంది. శ్రీ గరుత్మంతుడు, శ్రీ ముఖ్యప్రాణి విగ్రహాలు ఆలయంలో వున్నాయి. ప్రధాన ఆలయంలో శ్రీకృష్ణ సాలగ్రామ శిలావిగ్రహముంది. అది చాలా అందంగా వుంటుంది. కుడిచేతిలో చల్ల చిలికే కవ్వం, ఎడమ చేతిలో త్రాడు ఉండటం చూస్తాం.

ఈ సుందర విగ్రహం చుట్టూ, ఇత్తడి దీప సెమ్మెలున్నాయి. అవి ఎప్పుడూ వెలుగుతూనే ఉంటాయి. వీటిలో శ్రీమధ్వుడు వెలిగించిన సెమ్మె, ఇప్పటికీ వెలుగుతూనే వుంటుంది. అతని కాలంనాటి ఘంటామణి, కాష్ఠపీఠం, రజత అక్షయ పాత్ర, దీపసెమ్మె మొదలగు వస్తువులెన్నో అక్కడ దర్శనమిస్తాయి.

విజయదశమి రోజున తప్ప, ఆలయ తూర్పుద్వారాన్ని, మరెన్నడూ తెరువరు. ఈ ద్వారంవద్దనే శ్రీ చెన్నకేశవస్వామి విగ్రహం–అతని ఇరువురు ద్వార పాలకుల విగ్రహాలు ఉన్నాయి.

మధ్యసరోవరం మధ్యలో ఒక చిన్న మంటపముంది. దక్షిణ–పశ్చిమ తీరంలో గంగాదేవి విగ్రహం వుంది. శ్రీకృష్ణమఠం నుండి బయటకు రాగానే శ్రీ అనంతేశ్వర దేవాలయం కనబడుతుంది. ఈ ఆలయానికి తూర్పున శ్రీ చంద్రమౌళీశ్వర ఆలయముంది. మొదట్లో ఇక్కడ ఒక సరస్సుండేది. శివుడు ప్రత్యక్షమై, చంద్రునికి వరం ఇక్కడే ఇచ్చాడంటారు. రథయాత్ర రోజున శ్రీ అనంతేశ్వర–చంద్రమౌళీశ్వర విగ్రహాలు, ఒకే రథంలో ప్రక్కప్రక్కనే ఉంటాయి. శ్రీకృష్ణ రథోత్సవమప్పుడు కూడా మరో రథంలో రెండు విగ్రహాలు ఊరేగుతాయి.

శ్రీకృష్ణమఠం చుట్టూ, ఇతర మఠాలున్నాయి. శ్రీమధ్వాచార్యుని శిష్యులు ఆ మఠాల్లో ఉండేవారు. ఈ మఠాలతో పాటుగా ఉడిపిలో మరికొన్ని ఇతర మఠాలు కూడా ఉన్నాయి. శ్రీ రాఘవేంద్ర– శ్రీ వ్యాసరాయ– శ్రీ ఉత్తరాద్రి– శ్రీ భీమనాకట్టె–భండారకేరి–ములబాగల–శ్యామాచార్య మొదలగు మఠాలున్నాయి.

వీటితో పాటుగా, పరిసరాలలో చూడవలసిన క్షేత్రాలు అబ్జారణ్యతీర్థం–ఇంద్రాణీపర్వతం–దుర్గామందిరం–సుబ్రహ్మణ్య మందిరం–బిడాభాండేశ్వర–పజకక్షేత్ర–విమానగిరి–మధ్వవటమఠం–కణ్వతీర్థమఠం–తలకావేరీ–భాగమండలం–మొదలగునవి ఉన్నాయి.

పశ్చిమ సముద్రం నుండి క్రొత్తగా భూమి గ్రహించి, పరశురాముడు, ఏడు ముక్తిక్షేత్రాలను స్థాపించాడంటారు. అందులో రజితపీఠం ఒకటి. ఇక్కడే అనంతేశ్వరుడు, చంద్రమౌళీశ్వరుడున్నారు. శ్రీమధ్వాచార్యులు అనంతేశ్వరుని చెంతనే తపస్సు చేశాడు.

ఇది తప్పక చూడదగిన క్షేత్రం. OO



## నేటి చర్చనీయాంశము–

**శిష్యుడు (శివప్రసాద్)–** మహాత్మా! గురుదేవా! భక్తిత్రయమును గూర్చి తమముఖతః తెలుసుకొనగోరుచున్నాను. కాబట్టి అద్దానిని గూర్చి విపులంగ తెలియజేయ ప్రార్థన.

**గురువు (ప్రబోధానందజీ మహరాజ్) –** నాయనా! శివప్రసాద్! భక్తిత్రయమును గూర్చి తెలుసుకొనుటకు ముందుగ అసలు భక్తియంటే ఏమిటో? దాని ప్రయోజనమేమిటో? తెలుసుకొనవలసియున్నది. భగవంతునిపై మిక్కుటమగు ప్రీతి కలిగియుండుటయే భక్తి. భక్తియందు తన్మయత్వాన్ని పొందినవాడు "నీవే తప్ప ఇతఃపరం బెరుగ"నని భగవంతునితో పలుకును. "నాదేమియును లేదు. అంతయు మీదే. మీరే తల్లి, మీరే తండ్రి, నేను మీ దాసానుదాసుడను" అని దేవదేవుని గురించి వచిస్తాడు.

భయంకర సంసార సాగరమున చిక్కుకొనిపోయిన జీవునకు సర్వేశ్వరుని యొక్క, సద్గురువు యొక్క అనుగ్రహము మిక్కిలి ఆవశ్యకములై యున్నాయి. ఈ పరమరహస్యమెఱుగక ఎందరో జనులు తమ తమ స్వీయ లౌకిక ప్రజ్ఞచే ప్రకృతిని జయింపజూచి విఫలులైరి. ఏలయనగా ప్రకృతి పరమాత్మకు అధీనమై యుంది. పరమేశ్వరుని ఆశ్రయించనివారు బంధవిముక్తులు కాలేరు, ప్రకృతిపాశముల నుండి విడివడలేరు, విఘ్నాలను తప్పించుకోలేరు. ప్రకృతి బంధముల నుండి విముక్తిని కోరేవాడు ప్రకృతికి అధిపతి అయిన పరమాత్మను ఆశ్రయించాలి. భక్తితో, అకుంఠిత ప్రేమతో భగవానుని ఆరాధించువారు దైవానుగ్రహమునకు పాత్రులై సంకటములనుండి, సంసార బంధమునుండి విడివడుదురు. అనన్యభక్తిగల జనుల యోగక్షేమములను స్వయముగ భగవానుడే వహించునని గీతామాత ప్రబో

# ఆత్మానుసంధానము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

సర్వాధిష్ఠాన రూపోఽస్మి
సర్వథా చిద్ఘనోస్మ్యహం॥
చిత్తవృత్తి విహీనోఽహం
చిదాత్మైక రసోస్మ్యహం॥

నేను సర్వాధిష్ఠాన రూపుడను. సదా చిద్ఘనుడను. నేను చిత్తవృత్తిరహితుడను, చిదాత్మైక రసస్వరూపుడను. ○○

---

ధించుచున్నది.

మానవుడు ప్రాథమిక భక్తితో, ఫలపుష్పాదులతో దైవార్చన గావించుటతో తృప్తిపడక పరాభక్తిని కూడ అలవరచుకోవాలి. భగవన్నిర్మితములగు పుష్పాదులను దేవునకు సమర్పించుట మంచిదేకాని దానితో తృప్తిపడక మానవుడు తాను స్వయముగ నిర్మించుకొనిన సద్గుణములను దివ్యపుష్పములతో భగవదారాధన సలపాలి. ద్వేషరాహిత్యము, మైత్రి, దయ మున్నగు సుగుణరూప పుష్పాలతో హృదయమందు నివసించుచున్న పరాత్పరుని పూజించి, సేవించి మర్త్యుడు అమరుడై, కృతకృత్యుడై విలసిల్లాలి.

జ్ఞానముచే మోక్షము కలుగునను విషయము తథ్యము. కాని ఆ జ్ఞానం భక్తి చేతనే కలుగుతుంది. భక్తియను పుష్పము వికసించినపుడే జ్ఞానమను ఫలం ఆవిర్భవిస్తుంది. కాబట్టి శివప్రసాద్! భక్తిని చక్కగ అభివృద్ధిచేసుకో. భక్తి మూడు విధాలుగ యుంటుంది. దానినే భక్తిత్రయమంటారు. ఒకటి బాహ్యభక్తి, రెండు అనన్యభక్తి, మూడు ఏకాంతభక్తి–అని. వాటిని గూర్చి నీకు విపులంగ తరువాత చెప్తాను.

**శిష్యుడు** — స్వామీ! ఆచార్యవర్యా! భక్తియంటే తమ ముఖతః ఇపుడు చక్కగ తెలుసుకొన్నాను. జ్ఞానానికి కారణం భక్తియే కాబట్టి ముందుగా ఆ భక్తినే అభివృద్ధి చేసుకోటానికి ప్రయత్నం చేస్తా. సెలవు. ○○

# సార్థక జీవితం

కుమ్మరివాడు లేనిదే కుండ ఏర్పడదు. ఇల్లు కట్టే మేస్త్రీ లేకపోతే ఇంటి యొక్క ఉనికియే సంభవించదు. ఒక వస్తువును చూచినపుడు ఆ వస్తువును ఏర్పరిచిన 'కర్త' ఎవరు? అను ప్రశ్న తప్పక ఉదయిస్తుంది. జగత్తు ప్రత్యక్షంగ కనుపిస్తున్నది. సముద్రములు, కొండలు, అడవులు, సూర్యచంద్రాదులు, నక్షత్రములు మొదలైనవన్నీ ప్రత్యక్షంగ కనుపిస్తున్నాయిగదా! వీటి 'కర్త' ఎవరు? అను ప్రశ్న వివేకవంతుడైన ప్రతివానికి తప్పక ఉదయిస్తుంది. ఇవన్నీ ఆకాశంనుంచి అకస్మాత్తుగ ఊడిపడలేదు తన దేహాన్ని ప్రతివాడు స్వయంగ నిర్మించుకోలేదు. ఏ మహత్తరశక్తియో వీటన్నింటిని రూపొందించింది. ఆ శక్తియే దేవుడు.

అట్టి దేవదేవుని యెడల, అట్టి పరమేశ్వరుని యెడల ప్రతి జీవికూడ అకుంఠిత విశ్వాసము, భక్తిశ్రద్ధలు కలిగియుండాలి. తినుటకు తిండీ, త్రాగుటకు నీరు, ఆలోచించుటకు మేధ మొదలైనవన్నీ మనకు సమకూర్చిన ఆ విశ్వేశ్వరునకు మనము కృతజ్ఞత వెల్లడించాలి. ప్రతి దినము భక్తితో ధ్యానించాలి. వారి దివ్యనామాన్ని కీర్తించాలి, సంస్మరించాలి. వారియొక్క దివ్యకథలను స్మరణంచేస్తూండాలి. ఈ ప్రకారంగ నిరంతరం దైవస్మరణ, దైవధ్యానం చేస్తూండటంవల్ల మనస్సు దైవాకారంగ పరిణతమై మహాపవిత్రవంతమై ఆత్మానుభూతిని పొంది తరిస్తుంది. ఈ ప్రకారంగ భగవంతుని గుణగణములను స్మరింపక, వారి నామమును ఉచ్చరింపక, తమను సృష్టించిన పరమాత్మ యెడల కృతజ్ఞత కలిగియుండక గడుపబడిన జీవితం నిరర్థక జీవితమే అవుతుంది. అట్టివారి జీవితం పశుతుల్యమే కాగలదు. పశుత్వాన్ని పారద్రోలి మానవత్వాన్ని కాపాడుకొని సాధనాతిశయంచే క్రమంగ మానవత్వాన్ని కూడ దాటి దైవత్వం చేరాలి. ఇదియే ఉత్తమమానవుని లక్షణం.

కాబట్టి ప్రతివారును చక్కగ పర్యాలోచించి తమ లోన, బయట వెలుగుచున్న పరమాత్మను అహర్నిశములు జ్ఞప్తియందుంచుకొని ఆ పరమాత్మను చేరుటకు వలసిన సాధనసంపత్తిని పొంది ధన్యుడుకావాలి. అమూల్యమైన ఈ మానవ జీవితం నిరర్థకం చేసుకోరాదు. దైవానుభూతిని బడసి సార్థకంచేసుకోవాలి. ఇట్టి భావములనే క్రింది శ్లోకము విశదీకరించుచున్నది-

[illegible]

[illegible]

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :–

శ్రీ ఎమ్. ధర్మారెడ్డి గారు – నెల్లూరు
శ్రీ ఎమ్. నాగేశ్వరరావు గారు – తిరుపతి
శ్రీ కె. రాజేశ్వర్ గారు – హనుమకొండ
శ్రీమతి జి. సుధేష్ణ గారు – హనుమకొండ
శ్రీ వై. అంగల వేణుగోపాల్ గారు – చిన్నచింతకుంట
శ్రీ అన్నం రాధాకృష్ణయ్య శెట్టి గారు – పెనుమూరు
శ్రీ కె. శేఖరరావు గారు – గోల్‌బంద (ఒరిస్సా)
శ్రీ కె. రాజగోపాలరెడ్డి గారు – తుములూరు
శ్రీ వి. మురళీధరరావు గారు – హైదరాబాద్
శ్రీ ఎమ్. నరసింహం గారు – ఆకుతోటపల్లి
శ్రీ డా॥ బి. శ్రీధర్ గారు – అనంతపూర్
12. శ్రీ విశ్వకర్మ బి. ఆంజనేయ ఆచార్లు – అరగొండ
13. శ్రీ ఎమ్. వెంకటేశ్వరరావు గారు – ఆకివీడు
14. శ్రీ బి. సత్యనారాయణమూర్తి గారు – వేంపల్లె
15. శ్రీ పి. జె. చంద్రయ్య గారు – శ్రీకాళహస్తి

ఓం

[illegible]
సిరిసంపదలకు కాదన్నా!
తెగువతో ప్రాణములర్పిస్తె
పరమాత్ముని పొందుటకన్నా!

# త్రినేత్ర వైద్యాలయము - శ్రీ భక్తకన్నప్ప ఉచితకంటి ఆస్పత్రి నిర్వహణకు నూతనముగా విరాళములనొసంగిన దాతలు

| | రూ. |
|---|---|
| శ్రీ డా॥ శ్యామల కొల్లూరు గారు, అమెరికా | 11,116/- |
| శ్రీ ఎన్. కుమరన్ గారు, చిత్తూరు | 11,116/- |
| శ్రీ వాసవీ వార్షిక మహోత్రతువు, శ్రీశైలక్షేత్ర నగర ఆలిండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘము, మార్కాపురం | 11,116/- |
| శ్రీ రామస్వామి గారు, విజయవాడ | 11,116/- |
| శ్రీ రామప్రసాదు గారు, కల్లూరు (R.S.) | 11,116/- |

దాతలు

| | |
|---|---|
| శ్రీ ఎన్. శ్రీహరిరావు గారు, విజయవాడ | 2,000/- |
| శ్రీ కె. కామేశ్వరి గారు, షోలింగూర్ (T.N.) | 1,116/- |
| శ్రీ పి. చంద్రశేఖరరావు గారు, విశాఖ | 1,116/- |
| శ్రీ కె. రాజారామబాలరాజయ్య గారు, కామారెడ్డి | 1,116/- |
| శ్రీ కె. రామారావు & Co., ఏలూరు | 1,116/- |
| శ్రీమతి వి. రుక్మిణమ్మ గారు, సాదం | 1,116/- |
| శ్రీ ఎన్. లక్ష్మీదేవి గారు, హైదరాబాద్ | 1,116/- |
| శ్రీ బి. అనంతమ్మ గారు, జైనా (కరీంనగర్) | 516/- |
| శ్రీ టి. బుచ్చమ్మ గారు, జగిత్యాల | 516/- |
| శ్రీ పి. సంజీవరావు గారు, సికింద్రాబాద్ | 1,000/- |
| శ్రీ వై. ఇంద్రసేన గారు, సికింద్రాబాద్ | 1,116/- |
| శ్రీ ఎమ్. రామచంద్రయ్య గుప్త గారు, సికింద్రాబాద్ | 1,116/- |
| శ్రీ కె. హరనాథ్ గారు, హైదరాబాద్ | 232/- |
| శ్రీ వేముల సోమయ్య గారు, నెల్లికోడూరు | 1,116/- |
| శ్రీ సాధు వేంకటేశ్వర్లు గారు, చిలకలూరిపేట | 375/- |
| శ్రీ టి. మధుసూదనశెట్టి గారు, వెల్దుర్తి | 300/- |

| | |
|---|---|
| శ్రీ హెచ్. చిక్కన్న గారు, కనెకల్ | 300/- |
| శ్రీ ఎస్. శంకరప్ప గారు, నందికొట్కూరు | 116/- |
| శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ గారు, కాకినాడ | 116/- |
| శ్రీ కొల్లేపర రామారావు గారు, కొడమంచలి | 116/- |
| శ్రీ జి. సత్యమ్మ గారు – బ్రాహ్మణగూడెం | 116/- |
| శ్రీ భూశెట్టి కోదండరామశెట్టి గారు, తిరుపతి | 116/- |
| శ్రీ తనమాల సరోజనమ్మ గారు, మన్నెముత్తూరు | 116/- |
| శ్రీ వై.ఎల్.ఎన్. శర్మ గారు, A.T. అగ్రహారం | 116/- |
| శ్రీ రామడుగుల వేంకటేశ్వర్లు గారు, ఏలూరు | 116/- |
| శ్రీ బుల్లం నారాయణ, కరీంనగర్ | 116/- |
| శ్రీ సి. చిన్నస్వామిరెడ్డి గారు, శేషంనాయుడు కండ్రిగ | 516/- |
| శ్రీ కె. రామమ్మ గారు, సూళ్ళూరుపేట | 116/- |
| శ్రీ కె. బాలాజీ గారు, శ్రీకాళహస్తి | 116/- |
| శ్రీ ఎస్. బాలకొండప్ప గారు, తిరుపతి | 500/- |
| శ్రీ ఎల్. లక్ష్మణరెడ్డి గారు, శ్రీకాళహస్తి | 516/- |
| శ్రీ వి. రాజమ్మ గారు, తడుకుపేట | 516/- |
| శ్రీ ఎ. సీతారాం గారు, శ్రీకాళహస్తి | 1,016/- |
| శ్రీ మొరిశెట్టి సోమమ్మ గారు, సూర్యాపేట | 1,116/- |

## మనియార్డర్ల ద్వారా శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రికి విరాళములను పంపిన దాతలు

| | |
|---|---|
| శ్రీ వజ్రాల లక్ష్మన్నమ్మ గారు, పుల్లూరు | 1,116/- |
| శ్రీ డి. గంగాధర్ గారు, ఏలూరు | 1,116/- |
| శ్రీ వేంకటనరసింహులు గారు, మహబూబ్‌నగర్ | 1,116/- |
| శ్రీ డి. సురేష్ గారు, C/o. డి. రామచంద్రరావు, మానికొండ | 1,116/- |
| శ్రీ పి.వి. మురళీధర్‌రావు గారు, మంచిర్యాల (ఆదిలాబాద్) | 516/- |
| శ్రీ దాసుల సూర్యనారాయణశెట్టి గారు, మద్రాసు | 516/- |
| శ్రీమతి పి. లక్ష్మీరాజ్యం, W/o. వెంకటరావు గారు, విశాఖపట్నం | 516/- |
| శ్రీ ఎస్.సి. రంగప్ప గారు,B.A.B.L., హైదరాబాద్ | 416/- |

| | |
|---|---|
| శ్రీ ఆర్. రఘువీర్ గారు, బెంగుళూరు | 400/- |
| శ్రీ ఆర్. లక్ష్మణ్ గారు, సిద్ధిపేట | 316/- |
| శ్రీమతి కె. మీనాక్షమ్మ గారు, గుంటూరు | 216/- |
| శ్రీ ఎ. క్రిష్ణారెడ్డి గారు, చిన్నగొట్టిగల్లు | 216/- |
| శ్రీ బెలగంటి మాణిక్యరెడ్డి గారు, కొంకల | 216/- |
| శ్రీ ఎమ్. రత్నవిలాచారి గారు, చెర్లాపల్లి (తర్రూర్) | 216/- |
| శ్రీ జైని నరసయ్య గారు, చెర్లాపల్లి (తర్రూర్) | 216/- |
| శ్రీ కె. శివప్రసాద్ గారు, హైదరాబాద్ | 200/- |
| శ్రీ పి. శ్రీనివాసరావు గారు, హైదరాబాద్ | 200/- |
| శ్రీ జి.కె. స్వామి గారు, విశాఖపట్నం | 216/- |
| శ్రీ జి. పుల్లారావు గారు, విజయవాడ | 250/- |
| శ్రీ బచ్చు రామచంద్రయ్య & సన్స్, హైదరాబాద్ | 216/- |
| శ్రీ జి. చెంగల్‌రాయలు గారు, మద్రాసు | 250/- |
| శ్రీ బలుసూరి కమలమ్మ గారు, గోకవరం | 200/- |
| శ్రీ జి.యస్. క్రిష్ణకుమార్ గారు, విశాఖపట్నం | 250/- |
| శ్రీ గంథం చంద్రమౌళి గారు , బాలలక్ష్మి గారు, జడ్చర్ల | 216/- |
| శ్రీ టి. భాస్కర్‌రావు గారు, విజయవాడ | 180/- |
| శ్రీ కె. వీరభద్రరావు గారు, కాకినాడ | 150/- |
| శ్రీ కె. భాస్కర్‌రావు గారు, ఎస్.కొండేపాడు | 150/- |
| శ్రీ జి. వీరాస్వామి గారు, ఎస్.కొండేపాడు | 150/- |
| శ్రీ పి. యర్రయ్య గారు, N.C.Hills | 151/- |
| శ్రీ పి. వోచయ్య గారు, పరిగి | 142/- |
| శ్రీ జి.ఎన్. చలపతి గారు, తాతానగర్ | 125/- |
| శ్రీ సి. సుబ్బారావు గారు, జగ్గయ్యపేట | 200/- |
| శ్రీ ఎ. నారాయణ గారు, బొయ్యారం | 216/- |
| శ్రీ ఎ. సాంబశివరావు గారు, కాకినాడ | 250/- |
| శ్రీ ఎస్. సూర్యనారాయణచెట్టి గారు, మద్రాస్ | 516/- |
| శ్రీ పి.కె. గుప్త గారు, హైదరాబాద్ | 250/- |
| శ్రీ జి. నరేందర్ గారు, సికింద్రాబాద్ | 216/- |

| | |
|---|---|
| శ్రీ జి. శ్రీరామమూర్తి గారు, భీమవరం | 216/- |
| శ్రీ ఎ. చంద్రమౌళి గారు, ఉప్పల్ | 200/- |
| శ్రీ ఎన్. మల్లికార్జునరావు గారు, విజయవాడ | 200/- |
| శ్రీ పి. పెదకృష్ణారావు గారు, ఉద్దండపురం | 216/- |

శ్రీయుతులు

చిర్రావూరి వేంకటలక్ష్మి, అయిలూరు

సుశీలాదేవి, హైదరాబాద్

ఎ.వి.పి. ధర్మమూర్తి, విజయవాడ

కె. సన్యాసమ్మ, విశాఖపట్నం

పి.వి. క్రిష్ణారావు, విజయనగరం

సమయమంతుల రామారావు, కామయ్యపాళెం

వెల్ల అనసూయమ్మ, కపిలేశ్వరపురం

భీమవరపు సుబ్బారెడ్డి, దావెల

ప్రతాప్‌రెడ్డి, ముచ్చుమర్రి

ఎం. రామిశెట్టి, బొమ్మిరెడ్డిపల్లి

నారాయణ ఓంప్రకాశ్, తెనాలి

మేక నారాయణ, బొంబాయి

ఎమ్.ఎల్. సుబ్బారావు, పెద్దపల్లి (కరీంనగర్)

కె. నారాయణ, మద్దూరు

బి. రమణమ్మ C/o. ఎస్. చంద్రరావు, వైజాగ్

ఎస్. రాధాదేవి, హనుమకొండ

ఎం. చంద్రావతి గారు, విజయవాడ

ఎం.ఎస్. మురళీధర్‌రావు, విజయవాడ

సత్తి చంద్రారెడ్డి, పాలమూరు

చవ్వా క్రిష్ణయ్య, జడ్చర్ల

పార్వతీదేవి, వైకుంఠపురం (చీరాల)

ఎం. సత్యనారాయణ, కర్నూలు

ఆంతరంగిక భక్తుడు, ఎర్రగుంట్ల

ఇస్నేపల్లి సుబ్బరాజు, జగ్గయ్యపేట

డా॥ డి.ఆర్.కె. శాస్త్రి, కలకత్తా

బి. భుజంగరావు, కర్నూలు

ఎం. నర్సయ్య గుప్త, వంకమామిడి

నరసయ్య, బొంబాయి

ధర్మపూరి బ్రహ్మనాధం, కర్నూలు

టి. రామారావు, సికింద్రాబాద్

పి.ఎల్. రావు, సంబలపూర్

డి. శ్రీనివాసరెడ్డి, తాడికొండ

జి. మునియప్ప, కారువల్లి

జి. రాజన్న, మంచిర్యాల

బి. సాధురాం, భీమవరం

బత్తిన చిన్నలక్ష్మణరావు, జల్లూరు

బొడ్డు పీరాస్వామి, పండితవేలూరు

పగడాల అమ్మణమ్మ, అనంతపురం

చిలుకూరి వెంకన్న, పంచేటి

ఆర్.ఆర్. ఇందిరా, సికింద్రాబాద్

జి. వేముల రవీంద్రారెడ్డి, ఆదిలాబాద్

రామప్ప, మదనపల్లి

ఆకుల వైకుంఠము, మిడికొండ
ఎ. వెంకటరత్నం, పత్తిపాడు
పత్తిగోర్లి సత్యరావు, ఈదర (వైజాగ్)
ఎల్. వీరభద్రారావు, తాడేపల్లిగూడెం
ఆర్. సీతప్ప, కీలమంగళం (ధర్మపురి)
పి. వేంకటస్వామి, హైదరాబాద్
పి.ఆర్. విజయలక్ష్మి, మాలూర్ (K.S.)
జె. ప్రసాద్, హైదరాబాద్
జి. రంగమూర్తి, కాకినాడ
టి. రామారావు, సికింద్రాబాద్
బి. అరుంధతి, రాయచూరు
సిహెచ్. సీతామహాలక్ష్మి, సికింద్రాబాద్
జి. సరస్వతి, హైదరాబాద్
బి. సుబ్బరామయ్య, నెల్లూరు
కె. తిమ్మరత్నం, హైదరాబాద్
కె. భోస్మో, బర్హంపూర్
బి. కృష్ణమూర్తి, లక్కవరం
సాథక్, నిమ్మపూర్ (ఒరిస్సా) గార్లు.

విరాళములు పంపదలంచువారు ఈ క్రింది అడ్రసుకు మనియార్డరు ద్వారాగాని, డిమాండ్ డ్రాఫ్టు (ఏ బ్యాంకునుండి తీయబడినదైనా) ద్వారాగాని పంపవచ్చును.

అడ్రస్:

సెక్రెటరీ, త్రినేత్ర వైద్యాలయము
భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి
(Bhakta Kannappa Free Eye Hospital)
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి–517 640
చిత్తూరు జిల్లా (ఆం.ప్ర.)






1. 26.9.1993వ తేదీ తిరుపతియందు శ్రీ అన్నమాచార్య కళాక్షేత్ర భవనము నందు జరుపబడిన శ్రీ వివేకానందస్వామి చికాగో ఉపన్యాస శతజయంతి సందర్భముగా నిర్వహింపబడిన కార్యక్రమములందు ఉదయము, సాయంకాలము కూడా శ్రీ స్వాములవారు పాల్గొనిరి.

2. 20.10.1993వ తేదీ తిరుమల క్షేత్రమందు దేవీనవరాత్రుల సందర్భమున జరుపబడిన బ్రహ్మోత్సవముల కార్యక్రమమునందు సాయంకాలము గం.5.30ల నుండి 6.30 వరకు శ్రీ స్వాములవారు ఆధ్యాత్మికోపన్యాసము గావించిరి.

3. 16.11.1993వ తేదీ మొదలుకొని 26.11.93వ తేదీ వరకు బొంబాయి నగరమున సెంచురీమిల్ ఆవరణలో భావన్‌చాల్ ప్రాంతమందు శ్రీ స్వాములవారి ఆధ్వర్యమున 57వ గీతామహోత్సవము జరుగును.
<u>వివరములకు</u> : శ్రీ దున్న రాములు గారు, శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి గీతాసమాజము, వర్లి, బి.డి.డి. చాల్ నెం.60, గది నెం.22, అభ్యుదయ బ్యాంకు ప్రక్కన, బొంబాయి–400 018. ఫోన్ : 4920153.

4. డిసెంబరు 10, 11, 12 తేదీలందు కర్ణాటక రాష్ట్రము, గుల్బర్గా జిల్లాలోని <u>యానగొంది</u> పట్టణమందలి శ్రీ మాతామాణిక్యేశ్వరి ఆశ్రమమునందు జరుపబడు శ్రీ శివకోటి అష్టోత్తరశత(108) యజ్ఞమునందు శ్రీ స్వాములవారు పాల్గొందురు. ఫోన్ : హైదరాబాద్–530992, 841684
యానగొంది కోడ్ – 08473–7958



Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**



# పాతంజల యోగసూత్రములు 1-24



(సంగ్రహము)

## క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః

*తా॥ క్లేశములతోను, కర్మములతోను, కర్మఫలములతోను, వాసనలతోను ఏ విధమగు సంబంధములేని మహోన్నత వ్యక్తియే ఈశ్వరుడు.*

వ్యాఖ్య : భగవంతుని యెడల భక్తిగలవానికి యోగము చక్కగ సిద్ధించునని క్రిందటి (23) సూత్రమునందు తెలుపబడియుండెను. ఇక భగవంతుడు ఎట్టివాడో ఈ సూత్రమునందు వివరింపబడినది. జీవుడు దేశకాలక్రియలతో కూడిన మాయకు లోబడినటువంటివాడు. భగవంతుడు దేశకాలక్రియలకు అతీతుడు, మాయాధీశుడు. దేశకాలక్రియలు వారినేమియు చేయజాలవు. దుఃఖములుగాని, కర్మలుగాని, వాసనలుగాని వారిని ఏ మాత్రము అంటనేరవు.

దుఃఖములు అనగా క్లేశములు ఐదు విధములుగ చెప్పబడినవి. అవి ఏవనగా- 1. అవిద్య, 2. అస్మిత, 3. రాగము, 4. ద్వేషము, 5. అభినివేశము. అట్లే కర్మ మూడు విధములు- 1. విహితము, 2. నిషిద్ధము, 3. మిశ్రమము- ఇవియన్నియు సామాన్యజీవునకు సంబంధించినవేకాని భగవంతునకు వీటితో ఏమాత్రము సంబంధములేదు.

అట్టి నిర్వికార, నిశ్చల, నిరంజన భగవంతుని ధ్యానించుటవలన జీవునకు పాపము ప్రక్షాళనమై, చిత్తశుద్ధి చేకూరి యోగమునందు ఆరూఢత్వము సిద్ధించగలదు. కాబట్టి మనోనిగ్రహమును సాధింపదలంచువారు, శాంతిని అభిలషించువారు భగవంతుని యెడల అచంచలమైన భక్తిని కలిగియుండవలెను.

ఓం